Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ అక్టోబరు నెల 24 వ తేది శుక్రవారం [నెం 32 రు

## జపానులో యుద్ధ మంత్రివర్గము.

### దూరప్రాచ్య దేశములందు విషమస్థితి.

### జపాను సైబీరియాపై దాడిచేయునా, దక్షిణమువైపు తిరుగునా ?

జపానులో యీ నెల 16 వ తేదిన మంత్రివర్గం మారింది. అదివరకు అమెరికాతో రాయబారులు నడుపుచున్న ప్రధాన మంత్రి కోనాయి రాకుమారుడు రాజీనామా నిచ్చెను. అతనితోబాటు తక్కిన మంత్రులందరు రాజీనామాలిచ్చిరి. జనరలు హిడాకి టోజోగారు క్రొత్త ప్రధాన మంత్రిగ నియమింపబడెను. తనయిష్టమువచ్చిన వారి నతడు తక్కిన మంత్రులుగా నియమించుకొనెను. వారిలో పెక్కుమంది జపాను యుద్ధంలోదిగి జయించి, తూర్పు ఏషియా దేశాలన్నింటిపై అధికారం వహించాలనే ఆశగలవారే. ఈ క్రొత్త మంత్రివర్గం యుద్ధానికి యిష్టపడేది కనుక, దూరప్రాచ్యదేశాలలో విషమస్థితి యేర్పడినది.

జనరలు టోజోగారు కోనాయి మంత్రివర్గంలో యుద్ధ మంత్రిగా నుండెను. ఇతడు సేనానాయకుల ప్రతినిధిగానే అందుండెను. ఇతను తనక్రింది విదేశాంగ మంత్రిగా షిగెనోరి టోగోగారిని నియమించెను. టోగో అదివరకు జర్మనీలో జపాను ప్రభుత్వ రాయబారిగా వుండెను. కావున యీతడు తన కార్యవిధానం జర్మనీ సూచనల ననుసరించి నిర్వహించుననుకోవచ్చును. లండనులో జపాను రాయబారిగానుండిన షిగిమిట్సుగారు ప్రస్తుతం జపానులోనే యున్నా అతన్ని విదేశాంగమంత్రిగ నియమించలేదు. అందుచే క్రొత్త మంత్రివర్గం ధోరణి జర్మనీకి అనుకూలంగా వుండవచ్చు. మంత్రివర్గంలో ఎక్కువ పలుకుబడి గల్గి, దేశ వ్యవహారాలు నిర్ణయించుటకు అందులో ఎక్కువ అధికారం గల చిన్న మంత్రివర్గం వేరొకటివుంది. అందులో నియమింపబడినవారంతా కూడ ప్రజాప్రభుత్వపద్ధతులు సరిపడనివారే.

ప్రధాన మంత్రి జనరలు టోజోగారికి స్వదేశాభిమానం అపరిమితంగా వుంది. యితర దేశాలపై దురాక్రమణకు వెనుకతీయనంత దేశాభిమానం అతంది. యుద్ధశాఖ, దేశీయాంగశాఖ, ప్రధాన మంత్రిత్వం మూడు వీరే నిర్వహింపతలపెట్టిరి. జపాను సేనానాయకులందరిచే విశ్వసింపబడినవారువీరు. సైన్యం చెప్పినట్టు వినాలనే వీరి అభిలాషను ఎపుడూ దాచలేదు. యూరోపులో జరుగుచున్న యుద్ధం వలన జపాను లాభంపొందాలని చూస్తున్నది. అందుకే యిపుడు యుద్ధప్రియులగు మంత్రులు నియమింపబడ్డారు. రష్యా జర్మనీని పడమరను ఎదిరించలేక పోయినసమయాన, తూర్పున రష్యాయొక్క సముద్రతీర రాష్ట్రాలపై దాడి చేయాలని జపాను చూస్తున్నది. జపాను యిటీవలనే రష్యాతో, ఒక దేశంపై యింకోదేశం దాడి చేయరాదను ఒడంబడిక చేసుకుంది. జపాను వశమందున్న మంచూకో రాష్ట్రమునకు-రష్యా వశమందున్న మంగోలియాకుగల సరిహద్దు వివాదాలనుకూడ పరిష్కరించుకుంటూ గతవారంలోనే రష్యాతో ఒడంబడికయందు సంతకంచేసింది. అయినా సులభంగా రష్యాను ఓడించగలమనే ఆశయున్నపుడు యీ ఒడంబడికలను లక్ష్యంచేయకపోవడం జపానుకు, దాని మిత్ర దేశాలగు జర్మనీ-ఇటలీలకు సహజమే. రష్యాయొక్క పసిఫికు సముద్రం రేవు స్థలమగు వ్లాడివిస్టాకు జపాను దీవులకు ఎదురుగ అతిచేరువగావుంది. ఈ రేవుద్వారా రష్యాకు యుద్ధ సామగ్రిని అమెరికా పంపరాదని జపాను ఎన్నోసార్లు బెదిరించింది. కాని రష్యా లక్ష్యంచేయక జపాను యీ విషయంలో జోక్యం కలిగించుకోరాదని హెచ్చరించింది. అమెరికాగూడ యీ మార్గం కాపాడే పూనికవహించింది.

### దక్షిణంవైపు దృష్టి.

జపాను దీవులకు దక్షిణమున డచ్చివారివగు తూర్పు ఇండీసు దీవులున్నాయి. అందులో అనేక ముడిపదార్థాలు లభించును. ఆశియాఖండం దక్షిణభాగాన ఫ్రెంచివారిదగు ఇండోచీనా, దానిప్రక్కన స్వతంత్రరాజ్యమగు తాయిలండు (సయాం) కలవు. ఫ్రాంసు ఓడిపోగానే, జపాను వట్టి బెదరింపులతోనే ఇండోచీనాలో ముఖ్యమగు సైనిక శిబిరాలు పురములు వశపరచుకొని, ప్రక్కనున్న తాయిలాండుకు ప్రక్క బెదురుగావుంది. అయినా జపాను బెదిరింపులకు తాయిలాండు లొంగిపోలేదు. తన స్వాతంత్రం కాపాడుకోడానికి సైన్యం సిద్ధంగావుండంటున్నది. కాని యితర దేశాల సహాయంలేనిది తాయిలాండు జపానుదాడిని ఎదుర్కోలేదు. అమెరికావారి ఫిలిప్పైనుదీవులు, బ్రిటిషువారి ఆస్ట్రేలియా మున్నగు రాజ్యాలు యింకా దక్షిణంగా వున్నాయి. ఇవన్ని తాయిలాండుకి తోడ్పడడానికి సర్వ యత్నాలు యిదివరకే చేసినవి.

### క్రొత్త ప్రధాని ఉద్దేశాలు.

క్రొత్త ప్రధాని జనరలు టోజోగారు తమ మంత్రివర్గం ప్రథమసమావేశం ముగియగానే ఒక ప్రకటన చేసిరి. జపాను ప్రపంచశాంతి స్థాపనకే తోడ్పడదలచిందనియు, ముందుగా చీనాతగవు పరిష్కరించుకొని, తూర్పు ఏషియా దేశాల అభివృద్ధికి జపాను పాటుబడుననియు చెప్పిరి. స్వదేశంలో యుద్ధసమయానికి తగినయేర్పాటులుచేసి, తమతో ఒడంబడికలుగల దేశాలతో సఖ్యత ఘట్టిపరచుకోవాలనిరి. ఇందుకు దేశీయులందరు తోడ్పడి, ప్రభుత్వంలో విశ్వాసంచూపి తమ దేశపు 3000 సంవత్సరాల ప్రాచీన సాంప్రదాయములను కాపాడవలెననిరి. కాని వీరు చెప్పిన చీనా తగవు సులభంగా పరిష్కారమవుతుందా? ఐదేళ్లు యుద్ధం సాగించినా యింతవరకు పరిష్కారం కాలేదు. చీనా సైన్యాలు జపానుకు తగిన ఉజ్జీగావుండి తిరుగుదెబ్బలు బాగా కొడుతున్నాయి. జపానుకి ప్రాణావసిష్ట సమయంగావుంది. ఈ గండం తప్పించుకొడానికి ఎంతత్యాగమైనా చేయాలి. విదేశ సైన్యాలు జపాన్ను చుట్టివేస్తున్నాయని ప్రధాని టోజోగారు తమ మంత్రులను హెచ్చరిస్తూ చెప్పిరి. అంటే, అమెరికా

జ్యాల (ఇటలీ జర్మనీల) సఖ్యతవల్ల లాభంలేదనే అనుమానం కలిగి దేశమంతా "ఉక్కువంటి ఐకమత్యం" కలిగి శత్రువుల నెదుర్కోవాలని వీరు హెచ్చరిస్తున్నట్లుంది.

జపాను-అమెరికా దేశాలకు గల వివాదాలు పరిష్కరించుకోడానికి అమెరికా ముఖ్యపట్నమగు వాషింగుటనులో ప్రస్తుతం రాయబారాలు జరుగుతున్నాయి. ఇందు సమాధానం కుదిరే సూచన లేమిలేవు. జపాను దురాక్రమణ మానుకుంటేకాని జపానుతో రాజీపడం అని బ్రిటిషు ప్రధాని చర్చిలు యిటీవల చెప్పెను. అమెరికా నౌకాదళ కార్యదర్శియగు కర్నలు నాక్సుగారు జర్మనీ ఇటలీలతో జపాను కూడా చేరిందని, వారి సైన్యాలన్నింటిని ఓడించడానికి తగు సాధనలన్ని తాము చేస్తామని స్పష్టంగా చెప్పిరి.

## అమెరికా-జపాను రాయబారాలు.

అసలీ రాయబారాలు ఎట్లు ప్రారంభించేమో చూద్దాం. అట్లాంటికు సముద్రంలో బ్రిటిషు ప్రధాని చర్చిలుతో మాట్లాడివచ్చినవెంటనే అమెరికా అధ్యక్షుడు రూజువెల్టు పశిఫికు సముద్రంలో యుద్ధంరాకుండా చేయాలనే ఉద్దేశంతో జపానుకు కబురంపెను. ఇండో-చీనాలోనుండి జపాను సేనలు వెడలిపోతే అమెరికాలో జపానుకు ప్రతికూలంగావున్న వర్తకనిషేధాలను తొలగించి, వారి ద్రవ్యం ఘనీభవించకుండ వాడుకోడానికి ఏర్పాటులు చేస్తానని రూజువెల్టు చెప్పెను. దానికి బదులుగ జపాను ఆశ్చర్యకరమగు సూచనలు చేసింది. బ్రిటిషువారిదగు సింగపూరులోను, డచ్చి తూర్పు దీవులలోను, ఆస్ట్రేలియా ఫిలిప్పైనులలోను ఆయుధాలు పెంచరాదనియు, జపాను-చీనా తగవు శాంతంగా పరిష్కారం అగుటకు అమెరికా తోడ్పడవలెననియు జపాను కోరింది. అట్లాంటికులో చర్చలును చూసినట్లే, పశిఫికు సముద్రంలో తనను కలుసుకొని ఒడంబడిక విషయం చర్చించాలని అప్పటి జపాను ప్రధాని కోనాయి రాకుమారుడు రూజువెల్టు అధ్యక్షునికి సందేశం పంపెను. కాని యిట్టి సమావేశం ఒడంబడిక కుదిరేక జరుగవచ్చుకాని, ముందుగా బాగుండదని రూజువెల్టు బదులుచెప్పెను. రాయబారాలు అప్పటినుండి సాగుతునే వున్నాయి. కాని క్లిష్టస్థితి యేర్పడినట్లు కొద్దివారాలనుండి తెలుస్తున్నది. చీనాలోని రేవులను, నాల్గు ఉత్తర రాష్ట్రాలను తనకు యిచ్చేసి యితర రాష్ట్రాలలో తన సైన్యం వుంచడానికి ఒప్పుకోవాలని జపాను కోరింది. అమెరికా అందు కంగీకరించలేదు. తూర్పు ఏషియాలో జపానుకు ప్రత్యేకాధికారం వుండాలను సిద్ధాంతం అమెరికా అంగీకరించలేదు. చివరదాకా యీ రాయబారాలు చెడకూడదనే రెండుదేశాలు అభిలాషపడ్డాయి. పెనామా కాల్వవద్ద జపానువారి కుట్రలగూర్చి విచారణ యీసమయంలో జరుగరాదని రూజువెల్టు అధ్యక్షుడు వుత్తరువుచేసెను. అక్షరాజ్యాల ఒడంబడికవార్షికోత్సవం ఆర్భాటంలేకుండా జపాను జరిపింది. అమెరికాలో జపాను రాయబారిగవున్న వాకానుసీగారు తిరిగి అమెరికా ముఖ్యపట్నానికి జపాను నుండి వచ్చి యీ రాయబారాలగూర్చి ఏమి సందేశం తెచ్చునోయని వేచియున్నారు. కాని రాయబారాలు చెడినట్లే, కర్నలు నాక్సుగారి ప్రకటనవలన తెలుసుకోవచ్చును. వారు జపాన్ను నాజీ తత్వాన్నికూడ ఓడిస్తామని చెప్పిరి.

## ఎ. బి. సి. డి. రక్షణశ్రేణి.

దూరప్రాచ్యంలో, అంటే పశిఫికు సముద్రంలోనున్న జపాను వైపున్న ప్రాంతాలందు ప్రజాప్రభుత్వవిధానాన్ని రక్షించే రాజ్యాలు అమెరికాతో పాటు బ్రిటిషువలసలు, చీనా డచ్చి దీవులు ఉన్నాయి. ఇవన్ని కలసి జపాను సైన్యాలు దక్షిణంవైపు దాడివస్తే ఎదిరించి తరిమి వేయడానికి తమ సైన్యాలను సిద్ధం చేసుకుంటున్నాయి. ఇచట బ్రిటిషు సేనానాయకుడగు సర్ రాబర్టుబ్రూకు పాఫేముగారు బటేవియాలో డచ్చి సేనా నాయకునితోను, ఆస్ట్రేలియాలో ఆస్ట్రేలియా యుద్ధ సంఘముతోను సంప్రదించివచ్చిరి. ఈతని కేంద్రస్థానం సింగపూరు. జపానుతో తాము యుద్ధం చేయదలచుకోలేదు, కాని జపాను బలవంతపెడితే అందుకు సిద్ధంగావున్నామని వీరు చెప్పిరి. బ్రిటీషు సామ్రాజ్యానికి చెందిన ఆస్ట్రేలియా న్యూజిలండుల ప్రధానులుకూడ జపాన్ను ఎదిరించడానికి సిద్ధంగావున్నామని ప్రకటించేరు. తాయిలాండు దానికి పడమరగావున్న బర్మాకూడ దేశరక్షణ యేర్పాటులు దిట్టంచేసుకున్నాయి. జపాను సేనలను చీనా బాగా ఎదిరిస్తున్నది. రష్యా దూరప్రాచ్య నౌకాదళం, సైన్యం, విమానదళంకూడ జపాను దళములను మించిపోగలవు.

వీటన్నింటికి తోడు అమెరికాగలదు. అమెరికావారి ఫిలిప్పైను దీవులలో యుద్ధ సన్నాహాలు జరుగుతున్నాయి. పశిఫికు సముద్రంలో విమానాశ్రయాల నిర్మాణం అతివడిగా జరుగుచున్నదని అమెరికా నౌకాశాఖవారు ప్రకటించిరి. అమెరికా నౌకలు సముద్రంలో గస్తీ తిరుగుచునే ఉన్నవి. ఈ మహాసముద్రం మధ్యను హొనలులూదీవికి 1200 మైళ్ల దూరాన మిడువే ఐలండునందు అమెరికా నౌకాదళ శిబిరం అతివడిగా నిర్మించబడింది. పశిఫికు ఉత్తరదిక్కు కొసను అమెరికా భూభాగం చేరువగా డచ్చి హార్బరులోను, కోడెకునందుకూడ విమానాశ్రయాలు కట్టించిరి.

కావున, జపాను పడమరను రష్యాపై దాడిచేసినా, దక్షిణాన తాయిలాండు డచ్చి దీవులపైకి వచ్చినా ఏ. బి. సి. డి. (అమెరికా, బ్రిటను, డచ్చి, చీనా) సమిష్టి రక్షణ సేనలు ఎదుర్కొని హతమార్చేస్తాయని జపాను తెలుసుకోవాలి. జపాను సేనానాయకులు యిష్టపడితే యిప్పటికైనా జపాను యీ ప్రమాదం తప్పించుకోవడం మంచిది.

---

# యూరోప్పుపై ఇంగ్లాండు దాడి.

## ఉచితమా, అనుచితమా?

జర్మనీ యిపుడు రష్యాపై దాడిచేసి, కొంతప్రదేశం ఆక్రమించి మాస్కోనగరం సమీపిస్తూ, రష్యా ప్రభుత్వానికి చాలా ఒత్తిడి కలిగిస్తున్నది. రష్యాకు ఇంగ్లాండు సహాయం చేస్తున్నది. కనుక యీ సమయంలో ఇంగ్లాండు సైన్యాలు యూరోపులో జర్మనీ ఆక్రమించిన దేశాలపైకి దాడివెడలినచో, జర్మనీ పడమరను ఇంగ్లాండుతోను, తూర్పున రష్యాతోను ఒకేసారి యుద్ధం చేయవలసివచ్చును. జర్మను సైన్యాలు కొన్ని రష్యా రంగంనుండి యిటుమరలి, రష్యాకు ఒత్తిడి తగ్గును. అట్లాచేయాలని కోరుతూ ఇంగ్లాండులో కొందరు ఆందోళన చేస్తున్నారు. వారిమాటలు, వారి వ్రాతలు ఇంగ్లాండులో వున్న అమెరికా విలేఖరులు తమ పత్రికలకు పంపుచున్నారు. ఈ విషయమున ఏమిచేస్తారని పార్లమెంటులో ప్రశ్న వేస్తే ప్రధానమంత్రి చర్చిలుగారు జవాబుచెప్ప నిరాకరించిరి. తాము చేయదలచింది ముందుగా చెప్పేస్తే శత్రువులకు లాభిస్తుంది. అందుకని చర్చిలుగారూరుకున్నారు. సముద్రంపైనుండికాని, విమానాలమీదనుండిగాని శత్రుసేనలు వస్తే అణచివేయడానికి ఇంగ్లాండులో తగినంత సేన సంసిద్ధంగావుందని చెప్పేరు. ఇంగ్లాండుపై దాడిచేస్తామను

జర్మనీ ప్రగల్భాలు యిటీవల తగ్గిపోయినాయి ఇంగ్లాండు యూరోపులో ఎక్కడ సైన్యాలను దింపినా జర్మను సేనలను ఎదుర్కోవలసివుంటుందని గత డిసంబరులో హిట్లరు గొప్పగా చెప్పెను. ఇప్పుడు ఇంగ్లాండు సేనలదాడికి జర్మనులు తయారుకావలసిన స్థితివచ్చింది. వారికాభయం వుండడం మంచిదే. కాని అంతమాత్రాన మిత్రమండలి సేనలు తొందరపడతాయా ?

యూరోపుపై ఇంగ్లాండు దాడివెడలితే, జర్మనీ రెండు వైపులా యుద్ధం చేయవలసియుంటుందనీ, రష్యాపై ఒత్తిడి తగ్గిపోయి రష్యాకోలుకోగలుగుతుందనీ ; జర్మనీ ఆక్రమించిన దేశాలలో ప్రజలకు ధైర్యంకల్గి, తిరుగబడతారనీ ; జర్మనీ ప్రజలే నిరుత్సాహంచెంది ప్రభుత్వంపై తిరుగబడుటకో, ఓడిపోవుటకో సహాయకారిగా వుంటుందని ; యిన్ని లాభాలున్నాయని యూరోపుదాడి కోరేవారు చెపుతున్నారు.

కాని, ఇపుడు జర్మనీపై బ్రిటిషు విమానాలుచేస్తున్న దాడివల్లనే జర్మనీకి పడమరనుకూడ ఒత్తిడికలిగిందనీ, జర్మనీ పరిశ్రమలన్ని బ్రిటిషు బాంబులచే నాశనమైనాయనీ, పైవాదానికి జవాబుగా చెపుతున్నారు. అంతే కాక రష్యాకు అపుడే కావలసినంత సహాయం ఇంగ్లాండు చేస్తున్నది. ఇపుడు యూరోపుపై దాడికి ఇంగ్లాండు సైన్యాలు దిగితే, వాటికి కావలసిన సరకు ఆయుధాలు జాగ్రత్తచేసుకొని, రష్యాకు పంపడం తగ్గిపోవును. ఆవిధంగా రష్యాకు యిట్టి దాడివలన నష్టమేకాని లాభముండదు.

రష్యా ఓడిపోతుందేమో నన్న భయం ప్రపంచమంతట యిప్పటికన్న, రష్యాపై దాడి ప్రారంభమైనపుడే ఎక్కువగ ఉండెను. ఇంగ్లాండు దాడి వెడలితే దానికి సహాయం చేయడానికి జర్మనీ ఆక్రమిత దేశాల ప్రజలకు కొంత వ్యవధి వుండాలి. ఇపుడట్టి యేర్పాటు లేమిలేవు. వెనుక స్థిరమగు సైన్యాలే యూరోపులో అండగా వున్నపుడు ఫలవంతంకాని దాడి, యిపుడు సాధారణ ప్రజల సహాయంతోను, ఏకాకిగానున్న కొన్ని గుంపుల సహాయంతోను ఫలవంతమగునా ? గత యుద్ధంలో జర్మను ప్రజలు తిరుగబడి జర్మనీఓడిపోవడానికి నాలుగేండ్లు పట్టింది. ఇపుడప్పుడే యూరోపులో ఒక శత్రు సైనిక దళం దిగినంత మాత్రాన జర్మనీలో విప్లవం వస్తుందనుకోడానికి కారణాలగుపడవు. మిత్రమండలి ఆయుధాల ఉత్పత్తి ఎక్కువగానే జరుగుతున్నా యింకా ఎక్కువ అగుటకు అవకాశంగలదు. భూమిసైన్యాలు విజయం పొందాలంటే ఆయుధోత్పత్తి పోటీలో ముందుగెలవాలి. ఇంగ్లాండు జర్మనీలకు యీ పోటీ యిపుడు జరుగుతున్నది. బ్రిటిషువారి దిగ్బంధంవలన, విమానాల దాడివలన, జర్మనీ ఉత్పత్తి తగ్గుతున్నది. ఈ పోటీలో బ్రిటను ఆలస్యంగా చేరినా వడిగా ముందుకి పోతున్నది. కావున యిపుడీపని తగ్గించరాదు. పైగా, జర్మను సేనలు దక్షిణానగూడ దాడిచేస్తున్నాయి. కావున ఈజిప్టునుండి ఇరానువరకు మధ్యభాగంలో యికముందు తీవ్రయుద్ధం జరుగవచ్చు. జర్మనులు మధ్యధరా సముద్రం తూర్పు భాగంలోనున్న ఈజియను సముద్రం, నల్ల సముద్రములకు చేరిరి. అందుచే వారిసేనలను ఇండియాకురాకుండా అరికట్టాలంటే, రష్యాలో కాకసను ప్రాంతాలనుండి ఈజిప్టులో నైలువరకు రక్షణ యేర్పాటులు గట్టి చేయాలి. అక్కడనుంచిన సైన్యాలకు బాగా సప్లయిలు అందజేయాలి.

మాయిజ్ ప్రభువు దాడిచేయుట పిచ్చిపని అన్నాడు. అమెరికా సైనిక నిపుణులుకూడా, యీ విషయం చర్చించి, యూరోపుపై దాడిచేయడంవలన లాభముండదు, ప్రమాదమే యెక్కువుంటుందని అభిప్రాయం చెప్పేరు. జర్మనీ పడమర రంగమునందు యింకను 100 డివిజనుల సేన (సుమారు 1,20,000) నిలిపియుంచి బ్రిటను దాడి నెదుర్కొన సిద్ధంగా వుందని, దాడిచేయడానికి ఇంగ్లాండునకు 20 డివిజను మాత్రం గలవని అమెరికాలో అనుకుంటున్నారు.

# ఆఫ్గనిస్థాన్నుండి జర్మనులు పంపివేయబడుట

### ఇండియా ఇరాను రక్షణలకు అవసరం.

### ఆఫ్గను తాటస్థ్యమునకు భంగంకాదు.

[ఆఫ్గనిస్తాన్ ఇండియాకు ఉత్తరమునయున్న తురుష్క రాజ్యం. 250,000 చదరపు మైళ్లు. 10,000,000 జనసంఖ్య. కాబూలు ముఖ్యపట్నం. కొండప్రదేశము. ఈ దేశీయులు (కాబూలీలు) ఇండియాలో అన్నితావులందు వడ్డీవ్యాపారం చేస్తూవుంటారు. కండపుష్టికలవారు, యుద్ధప్రియులు, దేశం స్వతంత్రదేశం, మహమ్మదు జహీరను రాజు పాలించుచున్నాడు. రష్యాకు ఇండియాకు మధ్య యిది తటస్థదేశముగానుండి ఇంగ్లాండుతో స్నేహంగనే ఉంది. 1940 లో రష్యాతో వర్తక ఒడంబడిక చేసుకొంది.]

ఆఫ్గనిస్తానమునకు ఉత్తరమున రష్యా, తూర్పు-దక్షిణములందు ఇండియా పడమరను ఇరాను (పెర్షియా) గలవు. ఇపుడు రష్యా ఇంగ్లాండులు జర్మనీతో యుద్ధంచేస్తు, ఇరానులోకూడా ప్రవేశించి ఆ దేశం జర్మనులకు వశంకాకుండా కాపాడినవి. ఇండియా బ్రిటిషువారిదే. ఈ మూడు దేశాల మధ్యగనున్న ఆఫ్గనిస్తానం తటస్థంగా వున్నప్పటికి ఇందున్న జర్మనులు బ్రిటను, రష్యాలకేమైనా ప్రతికూల కుట్రలుపన్ని, హాని కలిగించవచ్చును. అందుచేత ఆఫ్గనిస్తానంలోనున్న జర్మనులను ఇటలీవారిని, ఆ దేశంనుండి వారివారి స్వదేశాలకు పంపించేయాలని ఇంగ్లాండు రష్యాలు కోరినవి. ఆఫ్గను ప్రభుత్వం అందుకు అంగీకరించింది. జర్మనీ, ఇటలీ ప్రభుత్వ ప్రతినిధికార్యాలయాలకు చెందినవారు కాక తక్కినవారంతా ఆఫ్గనిస్తానంనుండి వెడలిపోవాలని ఆఫ్గను ప్రభుత్వం ఉత్తరువుచేయ నిశ్చయించింది. జర్మనులు 90 మంది ఉన్నారు. ఇటలీవారు ఎందరున్నారో తెలియదు.

ఈ శత్రుదేశాల వారిని ఇండియా, ఇరాకు, టర్కీల మీదుగా వారి స్వదేశాలకు పంపించేపూచీ బ్రిటిషు ప్రభుత్వం వారు వహిస్తామంటే అందుకుగూడ ఆఫ్గను ప్రభుత్వం అంగీకరించింది. ఆ విషయం జర్మను, ఇటలీ రాయబారులకు తెలిపితే, వారున్నూ రవానా ఏర్పాటులు బ్రిటను చేయుట కంగీకరించిరి. బ్రిటిషువారియందు వారికెంత విశ్వాసంగలదో దానిబట్టి తెలియగలదు.

ఆఫ్గన్ ప్రభుత్వం యీ యుద్ధంలో తటస్థంగా నుండదలచినట్లు యిదివరకెన్నోసార్లు ప్రకటించిందనియు, తమ దేశంలోవున్న విదేశీయులు యీ తాటస్థ్యానికి భంగం చేయకుండా చూచుకుంటున్నదనియు, యిరుగుపొరుగు రాజ్యాలతో సఖ్యత చెడగొట్టుకోవడం ఆఫ్గను ప్రభుత్వానికి ఎంతమాత్రం యిష్టంలేదనియు, కాబూలు రేడియో నుండి ప్రకటించబడెను. ఆఫ్గన్ తాటస్థ్యమును గౌరవించియే, బ్రిటిషు ప్రభుత్వం అచటి జర్మనులను శత్రువులైనప్పటికీ, వారివారి స్వదేశాలకు భద్రంగా పంపించేస్తామని బాసచేసింది. అట్లు బాస చేయనియెడల ఎంతకాలంనుండో ఆఫ్గనిస్థానంలో పనులు చేయుచున్న జర్మనులు ఇటాలి

యనులను ప్రవాసంలో వుంచేందుకు వారిని ఇంగ్లాండునకు ఒప్పగించుటకు ఆఫ్గను ప్రభుత్వం సమ్మతించియుండదు. ఈ జర్మనులు ఆఫ్గనిస్థానంలో ఉంటే యిటు ఇండియాకు, అటు ఇరానుకు, ఆఫ్గను తాటస్థ్యానికి ప్రమాదమే. కావున వారిని పంపివేయుటకు ఆఫ్గను ప్రభుత్వం నిశ్చయించుట శుభదాయకము.

బ్రిటిషువారి కోర్కెను ఆఫ్గను ప్రభుత్వం యింత సులభంగా ఒప్పుకోవడం యీ రెండు దేశాల స్నేహానికి నిదర్శనం. కొన్ని మాసాలక్రిందట ఇరానులో యిట్టి పరిస్థితులే ఏర్పడినపుడు, బ్రిటిషువారు అచటి జర్మనులను పంపివేయమని కోరగా, ఇరాను రాజగు షా అంగీకరించలేదు. ఇరానులో అక్షరాజ్యాల ఏజెంట్లు ముందుగనే అక్కడి ప్రభుత్వాన్ని పెడమార్గాన పెట్టిరి. అందుచే బ్రిటిషు సేనలు, రష్యా సేనలు ఇరానులో ప్రవేశించి, తగుచర్య తీసుకోవలసివచ్చెను. షా దేశం విడచి పారిపోయెను. అంతట ప్రభుత్వం మారి, పరిస్థితులు మిత్రమండలికి సానుకూలపడినవి. తూర్పు దేశాలకు జర్మనీ దాడి భయం ఆ విధంగా తగ్గిపోయింది. రష్యాకు ఇరాను ద్వారా రాదారి ఏర్పడింది. ఇపుడు ఆఫ్గనిస్థాన ప్రభుత్వం ఇరాను షావలె మొండిపట్టు పట్టక, వెంటనే అంగీకరించుటచే, ఎటువంటి ఒడుదుడుకులు లేకపోయెను. ఆఫ్గను ప్రభుత్వం దూరదృష్టి రాజ్యతంత్ర పరిజ్ఞానం కన్పరచెను. శత్రు జాతుల వారివల్ల కలిగే వుపద్రవమును, బ్రిటను-రష్యాల స్నేహం వల్ల లాభమును, బాగా గుర్తెరిగినది. శత్రు దేశాల కుతంత్రాలిక ఆఫ్గనిస్తానంలో సాగకుండా చేయబడెను. ఆఫ్గనిస్తానం స్వాతంత్ర్యం బలపరచుకొనుచు బ్రిటనుతో ఆర్థిక సంబంధాలు పెంపొందించుకొని యితరులెవరు తనపై రాజాలనంత బలమును సాధించుకొని బ్రిటిషు రష్యాల సహకారంతో గొప్ప దేశం కావచ్చు. ఆఫ్గనిస్థానం తాటస్థ్యం కాపాడబడింది. ఇండియాకు సరిహద్దులో శత్రుభయం తొలగిపోయింది. ఇంగ్లండు ఆఫ్గనిస్థానముల సఖ్యత యిక ముందు వృద్ధిపొందగలదని ఆశింపవచ్చును.

# జర్మనీ ఆక్రమించిన దేశాలలో హత్యలు.

జర్మనీ చుట్టుఉన్న ఐదు రాజ్యాలను జర్మనీ యీ యుద్ధంలో ఆక్రమించింది. అందుఒక్క హంగేరిమాత్రం పేరుకి స్వతంత్రంగా వుంది కాని తక్కినవన్నీ జర్మను సైన్యాల పరిపాలనక్రిందనే వున్నాయి. ఆ దేశాలలో ప్రజలను జర్మను పోలీసులు తుపాకులతో కాల్చి హత్యలు చేస్తున్న వార్తలు విలేఖరులు యీ దిగువ రీతి వ్రాసిరి.

### హాలెండులో.

రహస్య సంఘానికి నాయకులనే కారణమున ముగ్గురు చంపబడిరి. వేరొకడు యావజ్జీవం ఖైదులో నుంచబడెను.

### జకోస్లావోకియా.

ప్రేగులోనున్న జర్మను అధికారి తాను అధికారానికి వచ్చిన మొదటి నాల్గు రోజులలో 145 మందిని ఉరితీయుటో, తుపాకీ ప్రేల్చి చంపుటో చేసెను. 228 మంది జర్మనీకి పంపబడిరి. అచట యిదివరకే నిర్బంధంలో వందల కొలది జక్కులున్నారు. జక్కు యుద్ధ వీరులిద్దరిని, అందులో ఒక 72 సం॥లు వృద్ధుని జర్మను అధికారి చిట్టచివరకు చంపెను.

### ఫ్రాంసు.

పారిసులో ఏర్పడిన నాజీ సైనికుల కోర్టువారు 42 సం॥ల కార్మికుని చేతిలో రివాల్వరు ఉందను నెపమున తుపాకితో కాల్చి చంపాలని తీర్పు చెప్పిరి.

### క్రోషియా.

జగ్రబు నగరంలో యిరువురు జర్మనులు చంపబడినందున 10 మంది కమ్యూనిస్టులు చావాలని జర్మను ప్రభుత్వం ఉత్తరువు చేసింది. జర్మను సైనికులతో కలసి నడుస్తూవుంటే చాటుగానుండి క్రోషియా ప్రజలెవరో తుపాకి కాలుస్తే యిద్దరు జర్మనులు చచ్చి, వేరొకడు గాయపడెను. వెంటనే జర్మను సైనికులు చేరువ యిండ్లన్ని వెతికి ఆర్గురుని పట్టుకొని, వారు కమ్యూనిస్టులని శిక్ష విధించిరి.

### హంగేరి.

హంగేరి ఆక్రమించిన యుగోస్లావియా రాజ్య భాగమునందు 42 సెర్బియా దేశీయులు, రహస్య కుట్రలు చేసిరనే సాకుతో కాల్చి చంపబడిరి. ఇకముందు సెర్బులు దొంగ హత్యలు మానకుంటే, చంపేయడానికి హామీగా 38 గురు సెర్బులు బంధించి యుంచబడిరి.

# ఈ వారం యుద్ధ వార్తలు.

### విమానదాడులు.

విమానదాడుల కీ వారము, వాతావరణము అంత అనుకూలముగలేదు. అయినను బ్రిటిషు విమానములు 15 వ తేది రాత్రి హాలండు, బెల్జియం, పడమటి జర్మనీలపై దాడుల సాగించి, రేవులపైనను, పారిశ్రామిక కర్మాగారములపైనను చాల బాంబుల వర్షించెను. ఒక శత్రువిమానము పడగొట్టబడెను. బ్రిటిషు విమానమొకటి యీ దాడులనుండి తిరిగి రాలేదు. 16 వ తేది రాత్రిగూడ జర్మనీ పడమటి ప్రాంతముపై దాడులు జరుపబడెను. బ్రిటిషు విమానములన్నియు సురక్షితముగ తిరిగివచ్చెను. రూరు ప్రాంతమునందలి ప్రధాన పారిశ్రామిక పట్టణమగు డ్యూయిస్‌బర్గుపైన—ఈ దాడిలో వేలకొలది బాంబులు వర్షింపబడెను. డంకర్కు, ఆస్టెండు, కలే రేవులపైనగూడ ఒక మాదిరి దాడులు జరుపబడెను. ఈ దాడులనుండి మొత్తం 4 విమానాలు తిరిగి రాలేదు. 19 వ తేదీన వాతావరణం ప్రతికూలంగా వున్నా బ్రిటిషు విమానాలు షెర్బర్గు (ఫ్రెంచి రేవు) ప్రాంతముపైన చాల సారులు దాడులు సాగించెను. అచటను రేడిగో స్టేషనులను మరఫిరంగులతో యెదిర్చి చాల నష్టము కల్గించిరి. రెండు విమానములు శిథిలమొనర్పబడెను. మరి కొన్ని విమానములు బులోన్ రేవుపై దాడి సాగించెను. శత్రు విమానము లెవ్వియు ప్రతిఘటించలేదు. 20 వ తేది పగలు, బ్రిటిషు విమానములు, ఫ్రాన్సులో వుత్తరభాగముపైకి చాల దాడులు సాగించెను. మందుగుండు గిడ్డంగుల మీదను, సైనిక శిబిరములమీదను చాల బాంబుల వేసెను. ఫ్రెంచి కోస్తాలో ప్రయాణమొనర్చుచున్న శత్రు నౌకలపై గూడ చాల బాంబులు వేయబడెను. ఈ దాడులనుండి రెండు బ్రిటిషు విమానములు తిరిగి రాలేదు.

అక్టోబరు 15 వ తేది రాత్రి కొన్ని శత్రువిమానములు బ్రిటిషు తూర్పు తీరముపైకివచ్చి కొన్ని పట్టణములపై బాంబులు వేసెను. వీనివలన "కొంత నష్టము గలిగెను. కాని ప్రాణనష్టమేమియు కలుగలేదు" అని బ్రిటిషు విమాన శాఖ వారు ప్రకటించిరి. 16 వ తేది రాత్రి శత్రువిమానములు,

# కాగితపుచెత్త యుద్ధానికి ఎంతో వుపకరిస్తూవున్నది.



ఫిరంగిగుండు, మందు ఉంచడమునకు తగినట్లుగా కాగితపు చెత్తతో ఇంగ్లీషువారు పరికరాలు తయారు చేస్తున్నారు. ఈ పరికరాలు పూర్వము లోహాలతో తయారయ్యేవి. లోహాలంతా ఇప్పుడు యుద్ధానికి కావలసి వచ్చినందువల్ల, ఇవి ప్రస్తుతము కాగితముతో తయారగుచున్నవి. ఈ పటములో యీ కాగితపు పరికరాలలోనుండి మందుగుండు బయటికి తీయబడుచున్నవి.

---

తూర్పు తీరమును దాటి లోనికి చొచ్చుకొనివచ్చెను. కాని యెక్కడను బాంబులు పడలేదు. వానిలో ఒక శత్రువిమానము పడగొట్టబడెను. 17 వ తేదీన శత్రువిమానములు బ్రిటనుపైకి రానేలేదు. 19 వ తేదీ సాయంత్రం చీకటి పడటంతోనే, జర్మను విమానము లొకటొకటిగా తూర్పు ఆంగ్లియా జిల్లామీదకువచ్చి అక్కడక్కడ బాంబులువేసి కొంత నష్టము గల్గించెను. కొంతమందికి దెబ్బలు తగిలెను. ఒక జర్మను విమానము పడగొట్టబడెను. 20 వ తేదిన బ్రిటను దక్షిణ తీరమునుదాటి లోపలి ప్రాంతమునకు చొచ్చుకొనిపోవుటకు ప్రయత్నించిన ఒక జర్మను విమానము పడగొట్టబడెను.

బ్రిటనుపై విమానదాడులు అధికమైతే ఒకే సమయాన 200 లక్షల ప్రజలు తలదాచుకోడానికి ఇంతవరకు రక్షణ స్థానమును (షెల్టర్లు) సిద్ధమొనర్పబడెనని పార్లమెంటులో స్నెల్లుగారు ప్రకటించిరి.

## ఇటలీ – ఆఫ్రికా మధ్యధరా.

వాతావరణము అనుకూలముగ లేకపోవుటచే, ఈ వారము ఆఫ్రికా రంగములయందెక్కువ తీవ్రమగు పోరాటములు జరుగలేదు. 20 వ తేదిన శత్రువులచే చుట్టు ముట్టబడియున్న టొబ్రూకు రేవు దుర్గమునందలి బ్రిటిషు సైన్యములలో గస్తీదళ మొకటి పొంచియుండి ఇటాలియను పటాలము సమీపమునకు వచ్చినతోడనే వారిపైబడి చాలమందిని చంపి చెల్లాచెదరుచేసెను.

లిబియా–ఈజిప్టు సరిహద్దులయందు యీ నెల 20 వ తేదిన ఉభయపక్షములకును చురుకుగ పోరాటము జరిగెను. హాఫా అను ప్రదేశమునుండి శత్రు ఫిరంగులు, బ్రిటిషు గస్తీ దళములపై గుండ్లను వర్షించుటకు ప్రారంభించెను. కాని బ్రిటిషు గస్తీ దళములు యే విధమగు నష్టమును పొందకయే తమ పనిని ముగించుకొని తిరిగివచ్చెను.

టొబ్రూకు దుర్గము చుట్టు ముట్టబడి 20 వ తేది 186 రోజులు దాటెను. ఇన్ని రోజులు శత్రుల ప్రతిఘటించి, జయప్రదముగ విరోధించినందులకు బ్రిటిషు ప్రధాన సైనికాధికారియగు సర్ జాక్ డిల్ గారు టొబ్రూకునందలి సైనికులను అభినందించిరి.

మాజీ భారత సర్వసేనానియగు సర్ క్లాడు జెకబుగారు రేడియోలో ప్రసంగిస్తూ, టొబ్రూకునందలి భారతీయ సైన్యములు గన్పరచుచున్న అద్భుతమగు ధైర్య, సాహస, పరాక్రమములను అభినందించెను.

18 వ తేదిన మాల్టా దీవియందు చాల శత్రువిమాన దాడుల హెచ్చరికలు జరిగెను. దీవియందక్కడక్కడ కొన్ని బాంబులు పడెను. ప్రజల ఆస్తులకు నష్టముగల్గెను. ఒక ప్రదేశమున కొందరు ప్రజలు మరణించిరి.

మధ్యధరా సముద్ర ప్రాంతమున సంచరించుచున్న రెండు ఇటాలియను టార్పెడో నౌకలు ముంచివేయబడెనని ఇటాలియను ప్రభుత్వము అంగీకరించెను.

బ్రిటిషు విమానములు ఉత్తర ఆఫ్రికాలోని బెంఘాజీ, ట్రిపోలీ మొదలగు ఇటాలియను రేవులపై దాడులు సాగించి బాంబుల వర్షించెననిగూడ ఇటాలియనులు ప్రకటించిరి.

బ్రిటిషు విమానములు 21 వ తేదిన ఇటలీలోని నేపిల్సు నగరముపై బాంబులువేసెనని ఇటాలియను ప్రభుత్వము ప్రకటించెను.

## టర్కీ–ఇరాక్–ఇరాన్.

టర్కీ ప్రభుత్వాధ్యక్షుడగు ఇనూనూగారు 21 వ తేదిన అలెగ్జాండ్రెటా నగరమున ఉపన్యసించుచు "మనమిప్పుడనుభవించుచున్న జాతీయ స్వాతంత్ర్యము మన కితర జాతులు యిచ్చినదిగాదు. మనము స్వశక్తిచే నెల కొల్పుకొనినది. ఈ స్వాతంత్ర్యమును నేడును రేపునుగూడ మనము కాపాడుకొని తీరెదము" అని టర్కీ ప్రజలను పురోత్సాహించెను.

ఇరాన్ దేశపు మాజీ 'షా' (రాజు) అగు రిజా అలీ ఖాన్ గారు దక్షిణ అమెరికాలోని అర్జెంటైనారిపబ్లికు అచ్చట నివసించుటకు ఉద్దేశించి, కొన్ని దినముల క్రిందట ఇరాన్ (పర్షియా)నుండి బయలుదేరెను. కాని ప్రస్తుత యుద్ధ పరిస్థితులలో అతడు అర్జెంటైనాకు ప్రయాణమొనర్చుట కంటె తాత్కాలికముగ మారిషస్ దీవియందు నివసించు

టుచితమని నిశ్చయింపబడెను. 17 వ తేదిన రిజా అలీ ఖాన్ గారు ప్రయాణమొనర్చుచున్న నౌక మారిషస్ కు చేరెను. అతడాదీవియందున్నంతకాలము సకల సౌకర్యములను గావించి, సమస్త గౌరవమర్యాదలతో ఆదరింపవలసినదని స్థానికాధికారులకు బ్రిటిషు ప్రభుత్వమువారు సూచనలను పంపిరి.

ఇరాక్ లోనికి తేయాకు, చక్కెర, ప్రత్తి, గుడ్డలు, మోటారు కారులు మొదలగువానిని దిగుమతి చేయుటకు వ్యాపార హక్కులన్నియు ప్రభుత్వమునకే యున్నవి. అది ప్రభుత్వము వారి గుత్త. ఇతరులు దిగుమతి చేయుటకు వీలులేదు. క్రొత్త ఇరాక్ ప్రభుత్వమువారు ఈ గుత్త హక్కులను రద్దు చేసుకొని ప్రజలందరకు యీ వస్తువులలో వాణిజ్యాధికారముగలదని అంగీకరించిరి.

ఇరాక్ నందలి జపాను రాయబారిని దేశమునుండి వెడలిపోవలసినదిగ బ్రిటిషు ప్రభుత్వముగోరినట్లు వ్యాపించిన వదంతులయందు తమకు తెలిసినంతవరకు యెట్టి నిజమును లేదని జపాను ప్రచురణ శాఖ కార్యదర్శి ఇషీగారు నుడివిరి. ఇరాక్ - జపాన్ దేశముల వర్తక సంబంధములుగూడ నిలిపివేయబడెనను వదంతియందుగూడ నిజములేదని హెచ్చరించిరి. ఆఫ్గన్ స్థానమునందున్న జర్మను, ఇటాలీయను ప్రజలను దేశమునుండి వెడలగొట్టవలెనని బ్రిటిషు - రష్యా ప్రభుత్వములు స్నేహపూర్వకముగ ఆఫ్గన్ ప్రభుత్వమును గోరెను. అటుల వెడలగొట్టబడువారు స్వదేశము జేరుటకు ఇండియా, ఇరాను దేశములగుండా టర్కీమీదుగా సురక్షితమగు ప్రయాణ సౌకర్యముల నొసగవలెనని ఆఫ్గన్ ప్రభుత్వమువారు గోరిరి. వాని నొసగుటకు బ్రిటిషు ప్రభుత్వము అంగీకరించెను కనుక త్వరలోనే ఆఫ్గన్ స్థానమునందలి అక్సిసు ప్రజలు వెడలిపోవలసివచ్చును. వీరిలో జర్మనుల సంఖ్య 90 కంటె మించదు. రాయబార కార్యాలయముల సిబ్బందితప్ప మిగిలినవారందరును వెడలగొట్టబడుదురు.

తమ దేశీయుల నీ విధముగ వెడలగొట్టుట అక్సిసు రాజ్యములలో చాల ఉద్రేకమును కల్గించెను. ఈ విషయమై జర్మను అధికారులలో ఒకరు మాటలాడుచు ఐరోపాలోని ఒకానొకదేశమునుండి బ్రిటిషు జాతీయులను వెడలగొట్టవలెనని జర్మను ప్రభుత్వముగూడ పట్టుపట్టవచ్చునని హెచ్చరించెను.

## రష్యా.

రష్యా రాజధానియగు మాస్కో నగరముచుట్టును ఈ వారము యుద్ధము తీవ్రమయ్యెను. మాస్కోకు పడమట 60 మైళ్ల దూరముననున్న మొజెయిస్కు వద్దను, ఉత్తరమున 100 మైళ్ల దూరముననున్న కలినిన్ వద్దను, దక్షిణమున 100 మైళ్లదూరమునను ఉభయపక్షములకును భయంకరమగు పోరాటము జరుగుచున్నది. 22 వ తేదీన మొజయిస్కునుదాటి మాస్కోకు 40 మైళ్లలోనికి వచ్చినటుల జర్మనులు ప్రకటించుకొనిరి.

రష్యా రాజధానిని మాస్కోనుండి, 550 మైళ్ల తూర్పుననున్న “సమరా” అను నగరమునకు మార్చుకొనినట్లు రష్యను అధికారులు 20 వ తేదిన ప్రకటించిరి. విదేశీయ ప్రభుత్వముల కార్యాలయములన్నియుగూడ ముందుగనే సమరా నగరమునకు మార్చబడెను.

మాస్కో నగరమును రక్షించుటకు నెలకొల్పబడిన “రక్షణసంఘము” నకు అధ్యక్షుడగు స్టాలిన్ నగరము ప్రమాదస్థితియందున్నదనియు అందుచే సర్వాధికారములతో నీ సంఘము వ్యవహరించుననియు ప్రకటించెను. నగరమున ప్రతి వ్యక్తినీ ప్రతి వస్తువును నగర రక్షణ కుపయోగించుటకు స్టాలిన్ వుత్తరవుగావించెను. వియస్మా ప్రాంతమున శత్రులచే చుట్టుముట్టబడిన రష్యను సైన్యములు, శత్రువలయమును భేదించుకొని మాస్కోరంగమునకు వచ్చి తమ సైన్యములను చేరెను.

దక్షిణమున, కాకేసియాకు సింహద్వారమగు రోస్టోవ్ నగరమునకు దక్షిణముగ 40 మైళ్లలోను నున్న టగన్రాగ్ నగరమును, పడమటగ 60 మైళ్లలోనున్న స్టాలినో అను నగరమును ఆక్రమించుకొంటిమని 20 వ తేదీన జర్మనులు ప్రకటించిరి.

ఉత్తరమున లెనిన్గ్రాడు రంగమున రష్యనులు ముట్టడించియున్న జర్మను సైన్యములపై తిరుగుదాడుల సాగించుచు వెనుకకొట్టి మరికొన్ని పరిసర గ్రామములను పట్టణములను ఆక్రమించుకొనగల్గిరి.

జర్మనులు కకేషియాను ప్రవేశించినయెడల బ్రిటిషు-భారతీయ సైన్యములను అచటి రష్యను సైన్యములకు సహాయమంపుటకు బ్రిటిషు ప్రభుత్వమువారు రష్యను సైనికాధికారులతో సంప్రదించుచున్నారు.

మాస్కో నగరమును శత్రులవశముగానీయమనియు తుదివరకును కాపాడెదమనియు స్టాలిన్ ప్రధాని ప్రకటించెను.

## అమెరికా-అట్లాంటిక్.

అమెరికను వర్తక నౌకలకు, ఆత్మరక్షణార్థము, ఆయుధములను అమర్చుటకు నిషేధమును తొలగించు చట్టమును సంయుక్తరాష్ట్రముల ప్రజా ప్రతినిధి సభవారు 17 వ తేదీన మొదటిసారి ఆమోదించిరి. 259 మంది చట్టమునకు అనుకూలముగను, 138 మంది ప్రతికూలముగను సమ్మతుల నొసగిరి.

కార్డలు హల్లుగారు “విదేశాంగ స్థాయి సంఘము యెదుట సాక్ష్య మొసగుచు, వర్తక నౌకలకు ఆయుధములను అమర్చరాదని తటస్థ శాసనమునగల నిషేధమును వెంటనే తొలగించుట అవసరమనిరి. అంతేగాక అమెరికను నౌకల యుద్ధ ప్రాంతములనుగూడ ప్రవేశించి, మిత్రమండలికి ఆయుధ సామగ్రిని సప్లైచేయుట అవసరమనియు అందుకుగల నిషేధమునుగూడ వెంటనే తొలగింపవలెననియు హెచ్చరించిరి.

ప్రస్తుత పరిస్థితులలో తటస్థ శాసనము నింకను వుంచుట చాల అవివేకమనియు దానిని వెంటనే రద్దుచేయవలెననియు అమెరికా దేశీయాంగ (ఇంటీరియరు) కార్యదర్శియగు హెరోల్డు ఐక్సుగారు ప్రకటించిరి.

అక్షరాజ్యములను ఓడింపవలెనినయెడల అమెరికా సంయుక్త రాష్ట్రములు వెంటనే రంగమున ప్రవేశింపవలెననియు లేనిచో సమయము మించిపోవుననియు వెండెలు విల్కీగారు అమెరికా ప్రజలను హెచ్చరించిరి.

అరువు కవులు చట్టము క్రింద, అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వము రెండు జలాంతర్గాములను బ్రిటిషు ప్రభుత్వమున కొసగెను.

అరువు కవులు పద్ధతిమీద, చాల విమానములు ప్రతి నెలా బ్రిటిషు దీవులకును, ఈజిప్టు మొదలగు మధ్య ప్రాచ్యరంగములకును అమెరికానుండి అనుక్షణమును దిగుచున్నవని అమెరికను సేనాని జార్జి హెచ్ బ్రెట్టుగారు వెల్లడించిరి.

దేశరక్షణ కార్యముల కుద్దేశించిన పనులకు తప్ప—నవంబరు 1 వ తేదినుండి, రాగిని యే యితర కార్యములకును వినియోగింపరాదని—అమెరికా ప్రభుత్వము నిషేధించెను.

బ్రిటిషు ప్రభుత్వము, నూనె రవాణా చేయుట కుపయోగించు 15 నౌకలను అమెరికా ప్రభుత్వమునకు ఒసగెను.

సంయుక్త రాష్ట్ర శాసనసభలో, ఇంతవరకును యుద్ధంలో అమెరికా జోక్యము కల్గించుకొనరాదనుచున్న ప్రతినిధులలో నొకరగు మార్కాంటొ నియోగారు—ఇపుడు—అమెరికానుండి ఐరోపా పశ్చిమ భాగమున సైన్యములదింపి—జర్మనులకు రెండవ వైపున యుద్ధరంగమును కల్పింపవలెనని ప్రభుత్వమును గోరిరి.

సంయుక్త రాష్ట్రములయందలి వివాదములలో చాల వరకు, జర్మను ప్రచారమే కారణమని డెమోక్రాటిక్ పక్షనాయకులలో నొకరగు సెనెటరు పిల్లుగారు ప్రకటించిరి.

కియర్నీ అను పేరుగల అమెరికను డిస్ట్రాయరు (చిన్న యుద్ధనౌక) ను ఐస్లాండుకు 350 మైళ్ల దూరమున ఒక జర్మను జలాంతర్గామి 17 వ తేదిన "టార్పెడో" లను ప్రయోగించి కొదిర్చెను. కియర్నీ మునిగిపోయినదని అనుకొనిరి. కాని నౌక మునిగిపోలేదు చాలదెబ్బలు తగిలి శిధిలమయ్యెను. 11 మంది నావికులు మరణించిరి. మరి 10 మందికి దెబ్బలు తగిలెను.

బాల్టిమోర్ నుండి ఇంగ్లండు ప్రయాణమై వెళ్లుచున్న "బోల్టు వెంచరు" అను నౌక ముంచి వేయబడెనని ప్రకటింపబడెను. ఇది అసలు అమెరికను నౌక, పనామా రాష్ట్రమున రిజిస్టరు చేయబడెను.

ఆఫ్రికా పశ్చిమ తీరప్రాంతమున, మరియొక అమెరికను సరకుల నౌకముంచి వేయబడెనని రూజ్వెల్టు అధ్యక్షుడు 21 వ తేదిన వెల్లడించెను.

## దూర ప్రాచ్యం.

దూరప్రాచ్యమున ఈవారము చాల విషమ సంఘటనలు సంభవించెను. జపానునందు ప్రధానమంత్రి కోనోయి రాకుమారుడును, ఇతర మంత్రులును 16 వ తేదీన తమ పదవులకు రాజీనామా నొసగిరి. జపాను జాతీయ లక్ష్యమును సాధించుట కవలంబించు పద్ధతులగురించి మంత్రులందరకును ఏకీభావము కుదురక పోవుటవలన రాజీనామానీయవలసి వచ్చెనని కోనోయి రాకుమారుడు ప్రకటించెను.

జపాను చక్రవర్తి సదరు రాజీనామాను అంగీకరించి, యుద్ధాంగ మంత్రిగనున్న లెఫ్టినెంటు జనరలు హిడియోటోజో గారిని ప్రధానిగ నియమించిరి. 18 వ తేదీకి టోజోగారు ఇతర మంత్రుల పేర్లను ప్రకటించెను. షిగెమొటో టోగో గారు విదేశాంగ మంత్రిగ నియమింపబడిరి.

జపానును సంగ్రామమున ప్రవేశపెట్టుటకుగాని, ఇతర దేశములతో సమాధాన పూర్వకముగ వివాదముల పరిష్కరించుటకుగాని, క్రొత్త మంత్రివర్గమునకు సర్వాధికారము లొసగబడెనని జపాను అధికారవార్త సంఘము వెల్లడించెను.

19 వ తేదీన ప్రధాని టోజోగారు ఆదేశమున మహా పవిత్రములుగ పరిగణింపబడు దేవాలయములకు జని అచ్చటి దేవుళ్లకు, తాను ప్రధాన మంత్రి పదవిని స్వీకరించిన విషయమును నివేదించెను.

జపాను మంత్రివర్గమునందలి మార్పులు అమెరికాలోను, బ్రిటనునందును చాల అలజడిని కల్గించెను. రూజ్వెల్టు అధ్యక్షుడు, దూరప్రాచ్య వ్యవహారములను రష్యా యుద్ధపరిస్థితులను చర్చించుటకు సైనిక, నౌకా, విమానశాఖాధికారుల పిలిపించెను. అందరుకలసి దీర్ఘముగ నాలోచనలొనర్చిరి.

అమెరికా సంయుక్త రాష్ట్రములు వెంటనే జపానుపైదాడి సాగించి జపాను, ఇటాలియను, ఫ్రెంచి నౌకా దళముల నిర్మూలింపవలెనని సెనెటు సభ్యులగు పెప్పరుగారు హెచ్చరించిరి.

అమెరికను వర్తక నౌకలు జపాను, చైనా సముద్ర ప్రాంతములను వదలి వెంటనే అమెరికను రేవులనుగాని, మిత్రదేశముల రేవులనుగాని చేరవలసినదని 17 వ తేదీన అమెరికను నౌకా శాఖవారు ఉత్తరువుచేసిరి.

జపానులో క్రొత్త మంత్రివర్గం ఏర్పడుటతో జపానుకు-అమెరికాకు సంగ్రామం చాల దగ్గరకు వచ్చినదని సుప్రసిద్ధ అమెరికను రేడియో వ్యాఖ్యాతయగు రేక్లిప్పరుగారు పల్కిరి. అమెరికా విదేశాంగ కార్యదర్శియగు కార్డెలు హల్లుగారు 18 వ తేదీన జపాను రాయబారిని పిలచి మాటలాడగా జపాను ప్రభుత్వము, ఇదివరకు సాగించిన రాజీమాటలను కొనసాగించుటకే కోరుచున్నదని జపాను రాయబారి తెలియజేసెను.

దూరప్రాచ్యమున బ్రిటిషు సర్వసేనాధిపతియగు సర్. బ్రూక్ పాఫాంగారు, ఆస్ట్రేలియా ప్రభుత్వయుద్ధ సమాలోచన సంఘమునకు హాజరై రక్షణ యేర్పాటులగురించి వివరముగ చర్చించెను. "జపానుతో మాకు యుద్ధం అక్కర లేదు. కాని జపాను కావాలని యుద్ధానికివస్తే, మేము సంసిద్ధంగానే వున్నాం" అని పాఫాంగారు ప్రకటించిరి

ఆస్ట్రేలియా సముద్రతీరమును శత్రునౌకలు ప్రవేశింపకుండ మందుగనులు మాటు పెట్టబడెనని 16 వ తేదిన ఆస్ట్రేలియను అధికారులు వెల్లడించిరి.

జపాను రష్యను సైబీరియాపై దాడి సాగించవచ్చుననియు, రష్యా సరిహద్దులలో ఇపుడు 5 లక్షల జపాను సైన్యముగలదనియు, ఏ క్షణమైనను మరి 5 లక్షలను చేర్చుకొనగలదనియు చైనా అధికారులు దెలుపుచున్నారు.

జర్మను ప్రభుత్వము వెండ్లరుగారిని, తాయి దేశమున (సయాం) తమ రాయభారిగ నియమించిరి. ఇతడిదివరకు బొలివియాలో రాయభారిగనుండెను. అచట నాజీకుట్రల కితడే కారణమని బొలివియా ప్రభుత్వ మారోపించుటచే, జర్మను ప్రభుత్వము అతని నాపదవినుండి మార్చిరి.

దూరప్రాచ్యమున చాలప్రమాదకరమగు పరిస్థితు లేర్పడుచున్నవనియు, తాయి ప్రజలు యెట్టి విషమ పరిస్థితులనైన యెదుర్కొనుటకు సిద్ధముగ నుండవలెననియు, తాయి అధికారులు రేడియోద్వారా 16 వ తేదిన ప్రజలను హెచ్చరించిరి.

ఆస్ట్రేలియాకు వాయవ్యముగ 400 మైళ్ల దూరమున తైమర్ అను దీవివున్నది. అందు కొంతభాగం డచ్చివారిది. మరికొంత పోర్చుగీసువారిది. జపానునుండి పోర్చుగీసు తైమరుకు విమాన ప్రయాణముల రహదారి నేర్పరుచుటకు జపానువారు పోర్చుగీసు ప్రభుత్వమునుండి హక్కును సంపాదించిరి. ఇది డచ్చివారికి ఇతరులకు గూడ అలజడి కల్గించుచున్నది.

చైనాలో ఇచాంగ్ రేవుపట్టణ పరిసరములనుండి చైనా సైన్యముల వెడలగొట్టితిమనియు, హూపే రాష్ట్రమున జరిగిన పోరాటమున 30 వేల చైనా సైన్యము నిర్మూలింపబడెననియు 19 వ తేదిన జపాను అధికారులు ప్రకటించుకొనిరి.

## విషీ.

ఫ్రెంచి రాజకీయ న్యాయసంఘమువారి శిఫార్సు ప్రకారము, విషీ ప్రభుత్వాధ్యక్షుడగు పెటెయిన్ సేనాని ఈక్రింది వారిని ఫ్రాన్సునందొక దుర్గమున కారాగారమునందుంచుటకు ఉత్తరువు గావించెను :—

(1) మాజీ ఫ్రెంచి ప్రధాని ఎడ్మండు డలాడియరు, (2) లియాన్ బ్లం (మాజీప్రధాని), (3) పాల్ రేనాడు (మాజీ ప్రధాని), (4) గామెలిన్ సేనాని, (5) మాండెలు (మాజీ కాలనీల మంత్రి) వీరిలో మొదటివారు యుద్ధారంభమున ఫ్రెంచి ప్రధానమంత్రిగ నుండెను. లియాన్ బ్లం యుద్ధమునకు పూర్వ ప్రధానిగనుండెను. రెనాడుగారు యుద్ధపు తుదిరోజులలో ప్రధానిగనుండెను.

పైవారుగాక మాజీ విమానశాఖ మంత్రియగు గైలాషాంబ్రే గారును, ఆయుధనిర్మాణశాఖమాజీ మంత్రియగు జాకోమెట్ గారును బ్యురోసాన్ పట్టణమున ప్రవాసమునందుండునటుల గూడ ఉత్తరువు గావింపబడెను.

పెటెయిన్ సేనాని పై నిర్బంధములను ఉత్తరువుచేయుచు, త్వరలోనే వీరిపై నేరములు విచారణకు వచ్చుననియు, ఫ్రాన్సునకు జరిగిన ద్రోహముల వెల్లడిచేయవలసిన భారము

తనపైనున్నదనియు, తనయందు విశ్వాసముంచి, తుదివరకును సహకారమొనర్పవలెననియు, ఫ్రెంచి ప్రజలకు సందేశము నొసగెను.

ఉత్తరాఫ్రికాయందలి ఫ్రెంచి పరిపాలన కర్తయగు వేగాఁడు సేనాని శని ఆదివారములలో విషీకివచ్చి, అచట జరిగిన విషీ మంత్రివర్గ సమావేశ చర్చలయందు పాల్గొనెను. **20** వ తేదిన అతడు తిరిగి ఉత్తర ఆఫ్రికాకు ప్రయాణమై వెళ్లెను.

## ఆక్రమిత ప్రాంతములు.

యుగోస్లావియాలో ప్రజలు **100,000** మందికి పైగా జర్మను సైనికాధికారుల పాలనపై తిరుగబాటుచేసి "గొరిల్లా" పద్ధతిలో అన్ని ప్రాంతములందును పొంచి యెదుర్చుచు పోరాడుచున్నారు. అందుచే, జర్మను సైన్యములు వానిని అణచజాలక తమ శిబిరములను రక్షించుకొనుటతో సంతృప్తిపడి యూరకొనవలసివచ్చుచున్నది. సర్వియా ప్రాంతమునందలి సుప్రసిద్ధులగు కళాశాలలయందలి ఉపాధ్యాయులు, డాక్టర్లు, లాయర్లు తమ వృత్తులమాని, అడవులకు జని తిరుగబాటుదారులతో చేరుచున్నారు. ఇదివరకు యుగోస్లావియా సైన్యములలో పనిచేసిన సైనికాధికారులు వీరికి నాయకత్వము వహించి నడుపుచున్నారు.

క్రోషియా (యుగోస్లావియాలో ఒక భాగము) ప్రజల నాయకుడును మాజీ ఉప ప్రధాన మంత్రియు అగు డాక్టరు మాచిక్ గారిని, జర్మనులు తమ ఆదరణ క్రింద నెలకొల్పబడు ప్రభుత్వమునకు నాయకత్వము వహింపవలెనని కోరిరి. కాని అతడు అంగీకరింపలేదు. అతడు, ఇంగ్లాండునందున్న యుగోస్లావియా ప్రభుత్వనాయకులతో ఉత్తర ప్రత్యుత్తరముల జరుపుచున్నాడను అనుమానముతో, జర్మను అధికారులు, అతనిని పోలీసు ఆచూకీయందుంచిరి.

జర్మనులు ఆక్రమించియున్న హాలండు - బెల్జియం దేశములలో ప్రజల స్థితి చాల క్లిష్టమగుచున్నది. హాలండులో, జర్మను చర్యలవలన అసలే ఈ సంవత్సరము వ్యవసాయము తగ్గెను. పండిన పంటను అంతనుగూడ జర్మను అధికారులు తమ దేశమునకు లాగుకొని పోయిరి. అందుచే ప్రజలు ఆహారపదార్థములకు చాల అవస్థపడుచున్నారు.

బెల్జియం ఫాక్టరీలను చాలవరకు జర్మనులు తమ దేశమునకు మార్చుకొనిరి. మిగిలిన వానిలో గూడ తమకు కావలసిన ఆయుధముల తయారుచేయించు కొనుచున్నారు. అందుచే బెల్జియం ప్రజలు తమకు కావలసిన వస్తువులు లేక చిక్కుపడుచున్నారు. ప్రత్తి మొదలగు ముడిపదార్థములు లభింపక, గుడ్డల పరిశ్రమలు మూలపడుచున్నవి. ప్రజలు నూలు గుడ్డలు లేక, కాగితముతో తయారు చేయబడిన గుడ్డల కట్టుకొనవలసిన పరిస్థితు లేర్పడుచున్నవి.

ఫ్రాన్సునందు జర్మనులు ఆక్రమించియున్న ప్రాంతములోని "నాంటీ" అను పట్టణముననున్న జర్మను పటాలమునకు నాయకుడగు కారల్ ఫ్రెడరిక్ హాల్ట్సు సేనాని, **20** వ తేదీ ఉదయము తిరిగి తన బసకు వచ్చుచుండగా, ఇద్దరు పొంచియుండి అతనిని యెదిర్చి రివాల్వరుల గుండ్లను అతనిపై బారుచేసిరి. అతడు వెంటనే మరణించెను.

హాల్ట్సు హత్యకు ప్రతీకారముగ, తామదివరకే పట్టియుంచిన, ఫ్రెంచి కమ్యూనిస్టు ప్రముఖులలో 50 మందిని, జర్మను అధికారులు తుపాకులతో కాల్చి చంపివేసిరి. గురువారము రాత్రిలోగా హంతకులు పట్టుబడని యెడల మరి **50** మందిని చంపివేసెదమని జర్మను అధికారులు ప్రకటించిరి. నాంటి ప్రాంతపు పోలీసు అధికారిని జర్మనులు అరెస్టు చేసిరి.

## నౌకా నష్టములు.

**1917** వ సంవత్సరమున జర్మను జలాంతర్గాములచే నష్టమైన బ్రిటిషు మిత్రమండలి నౌకా నష్టముల కంటె, గత **12** నెలలలోను జర్మనులు జలాంతర్గాములను, విమానములను, యుద్ధనౌకలను ఉపయోగించి కల్గించిన నౌకా నష్టములు చాలతక్కువ అని, బ్రిటిషు నౌకాశాఖ మంత్రియగు ఎ. వి. అలెగ్జాండరుగారు వెల్లడించిరి.

ఈ నెల 18 వ తేదిన ఐస్లాండు ప్రాంతమున, సముద్రములో ఒక నౌకయందు కొందరు బ్రిటిషు నావికులు కనిపించిరి. వారి నౌక 14 రోజుల క్రిందట శత్రులచే ముంచివేయబడెననియు అప్పటినుండియు ఆ నౌకలోనేవుంటిమనియు ఆ నావికులు చెప్పిరి. వారిలో చాలమంది చాల జబ్బు స్థితిలో వుండుటచే వెంటనే వైద్యశాలకు పంపబడిరి. ఈ నౌక రక్షణ లేకుండ ఒంటరిగ ప్రయాణ మొనర్చు చుండెను.

గడచిన 18 మాసములలోను బ్రిటిషు నౌకాదళ సైనికబలము రెట్టింపు వరకు హెచ్చింప బడెను.

## తటస్థ రాష్ట్రములు.

ఐర్లండు ప్రధాన మంత్రియగు డివెలిరాగారు 19 వ తేదిన తన దేశీయులకు సందేశమొసగుచు, ఐర్లండుపైన త్వరలోనే దాడి జరుగవచ్చుననియు, ఐర్లండు యుద్ధములో చిక్కుకొను ఉపద్రవకరమగు పరిస్థితులు, ఇదివరకటి కంటె ఇప్పుడు చాల హెచ్చెననియు హెచ్చరించెను. అందుచే ప్రజలను విరివిగ సైన్యములలో చేరి, తమ దేశమును రక్షించుకొనుటకు సిద్ధపడవలసినదని గోరెను.

పనామా (అమెరికా) ప్రభుత్వము, తమదేశపు వర్తక నౌకలకు ఆయుధములను అమర్ప రాదని ఇటీవల నిషేధించెను. గతవారము పనామాలో అధికారులు తిరుగబాటుచేసి, అప్పటి అధ్యక్షుని తొలగించి, అన్ని పక్షముల ప్రతినిధులనుగల జాతీయ ప్రభుత్వమును నెల కొల్పు కొనిరి. క్రొత్త ప్రభుత్వపు అధ్యక్షుడు 21 వ తేదిన తమదేశపు వర్తక నౌకలు, ఆత్మరక్షణార్థము, ఆయుధముల నమర్చుకొనవచ్చునని అనుమతి నొసగుచు ఉత్తరువులగావించెను. ప్రాత అధ్యక్షుడు కారాగారమునందుంచబడెను.

కోస్టారికా ప్రభుత్వము, తమదేశమునందలి జర్మను ప్రభుత్వ (ప్రతినిధులు) కాన్సలులకుగల అనుమతి పత్రములన్నిటిని రద్దుచేసెను.

కూబా (అమెరికా) యందలి స్పెయిను రాయబారి కార్యాలయముననున్న ప్రచురణ శాఖాధికారిని వెంటనే తొలగింపవలెనని, ప్రభుత్వకార్యదర్శి, స్పెయిను ప్రభుత్వమునుకోరెను. సదరు ప్రచురణ శాఖాధికారి, కూబాలో. ఆక్సిసు రాజ్యముల తరఫునను, స్పెయినునందలి ఫలాంగిస్టు పక్షము తరఫునను ప్రచార మొనర్చుచున్నాడనియు, దానిని తాము సహింపమనియు కూబా ప్రభుత్వము తెలియజేసెను.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.